శివవేంకటేయ గ్రంథమాల. సప్తమపుష్పము.




# పుత్రికాస్మృతి

( కరుణరసభూయిష్టము. )

ఇది

అంగలూరు పురవాస్తవ్యుఁడు

నందగిరి వేంకటప్పారాయ

విరచితము.

మొదటికూర్పు 1,000 ప్రతులు.

బెజవాడ వాణీముద్రాక్షరశాలయందు

బి. కే. స్వామిచే ముద్రితము.

1915.

కాపీరైట్ ] [ వెల 2 అణాలు.



పత్రి లక్ష్మీబాయి

# సంపాదకీయ భూమిక.

---

ఇది "పుత్రికాస్మృతి" యను కరుణా[illegible]మగు చిన్నిపొత్తము. ఇందు వర్ణింపఁబడిన "లక్ష్మీబాయి" నాకుం గాదిలి మేనగోడలు. ఈగ్రంథకర్త లక్ష్మీబాయికి దండ్రియు విద్వత్కవియు. సీమె సహోదరులు నల్వురు వరుసగా రామాబాయి, లక్ష్మీబాయి, భరతాబాయి, శత్రుఘ్నాబాయి యను పేరులం బెట్టి గ్రంథకర్త తనకుంగల రామభక్తిని వెల్లడించె. ఈయన వ్రాసిన గ్రంథములలోఁ బెక్కులు రామకథావర్ణితము లేయగు. పుత్రసంతానములేని యీమహోదారుండు స్త్రీసంతానమే యాహికాముష్మిక సాధనమని సాధించి స్త్రీవిద్యాపాఠశాలాస్థాపనాది బహుకార్యంబులొనర్చినాఁడు. ప్రథమ సంతానమగు రామాబాయి, లక్ష్మీబాయి యను వారలు కవలబిడ్డలు. వీరిపుట్టుకయే యంగలూరు స్త్రీవిద్యాభ్యాసనంబున కుం బుట్టినిల్లుగాఁజేసినది. వీరలవిషయమై యీతలిదండ్రులు చూపించిన ప్రేమాదులు వర్ణనాతీతములు. రూపగుణవిద్యాసంపదలయందిందు భేదంబుసెప్పుటకుఁ దలిదండ్రులే తొట్రుపడుచున్నప్పుడితరుల వేఱుఁగజెప్పనేల? ఏకకాలమందుద్భవించి, యేకకాలమందుఁ బరిణయములంగాంచి, యేకకాలంబునందీడేరి యుభయ వంశంబుల వారినుద్ధరించెదరని నమ్మియుండిరి. అందద్దానివమ్ముగావించిన యీలక్ష్మీబాయియను సూర్యకిరణ లక్ష్మియస్తమానము మిగుల దుఃఖావహము. దుర్భరసంపతామూలము. పదునాలుగేండ్లప్రాయంబుననే గర్భవతియగు సీబా

లారత్నమునకు సీమంతముంజేయం గూర్చికొనిన సామగ్రులు పైతృకకర్మల కుపయోగింపఁజేసిన తలిదండ్రుల వ్యసనాధిక్య మెట్టిదియో యెవరువర్ణింపఁగలరు? అకాలప్రసవమొంది పుత్ర కిశోరముతో హఠాత్తుగ స్వర్గగమనమొనరింపం గన్నులారఁ గాంచిన యితరజనంబులకే గుండెలుబ్రద్దలగుచుండఁ, గని, పెంచి, తమకేడుగడగా భావించికొనెడి మాతాపితృల కెట్లుండు నని వ్రాయఁగలను? దుఃఖాధికదినంబులందుఁ దజ్జనకుండగు గ్రంధకర్తగారిచే వ్రాయఁబడిన యీపద్యంబులను సేకరించి విషయ నిర్ణయముగ నిందుఁబొందుపరచితి. ఈబాలికామణికి తొమ్మిదేండ్ల ప్రాయంబునఁ దీయంబడిన ఛాయాపటంబొండు నాయొద్దనుండినందున దాని నిందు ముద్రింపించితిఁ గాన నీగ్రంధకర్తగారికిని వీరిధర్మపత్నియు నాకక్కయునగు శేషగిరమ్మగారికి నిందుమూలమున నాకృతజ్ఞత తెలియంబడులాగునఁ నీ శీర్షిక నాబుద్ధికొలంది నున్నదున్నట్లు వెల్లడించినాఁడ. ఓసజ్జనులారా! నవరసంబులలో మూఁడవదగు నీకరుణారసంబు ప్రతిపద్యములోను నీకవి విభావానుభావ వ్యభిచార సంచారీభావములతో స్థాయీభావంబు ప్రధానంబుగా సహృదయ హృదయంబుల మొలకలెత్తునటుల సంఘటింపఁజేసెఁ గావున రసజ్ఞులిందలి రసంబు ప్రతిపదంబునను గ్రోలుదురని నమ్ముచున్నాఁడ. ఓంశాంతిశ్శాంతిశ్శాంతిః.

గుడివాడ.
6—3—1915.

ఇట్లు,
యల్లంరాజు వేంకట నరసింహాం,
సంపాదకుఁడు.

# పీఠిక.

కృష్ణామండలములోని యంగలూర నివాసమొందిన యానందగిరి వేంకటప్పారాయకవిని నేనింతప్పటినుండియు నెఱుఁగుదు. ఇతండాంధ్రంబున ననేక ప్రబంధములను సులభశైలిని వ్రాసిన ప్రౌఢకవి. అంగలూరు గ్రామాధిపతి. మఱియుం దనకుంగల పుత్రికామణుల నల్వురిలోఁ దొంటి యిద్దరును గవలై జన్మించుటం జేసియో! సమాన తరుణరూపరేఖావిలాసానురూప కనక ప్రతిమాస్వరూప సంపన్నలగుటంబట్టియో? తనహృదయపుటంబున నతిశయ్యంబుగ నూటలూరు ప్రేమ రస ఝుళంఝుళిలలో నీపుత్రికాద్వితయంబును, సురాసుర కరతల బంభ్రామ్యమాణ మంధరగిరి మధ్యమానదుగ్ధ సాగరాంతరాళ తరంగమాలావళులలోఁదేలు నొకమహారత్నయుగళంబు భాతి ననుకరింప మెప్పించుచుఁ గాలక్షేపముఁ జేయుచుండ నీనడుమ నందు రెండవది "లక్ష్మీబాయి"యను రత్నమును భగవంతుండగు నుపేంద్రుండు, నాఁడు చింతామణి నింద్రుండాకర్షించిన విధంబున నకస్మాత్తుగ నపహరించిన కతంబున నీకవియుఁ దా వివేకవంతుండవయ్యు నాటిరఘురాముండువోలె నరలీల ననుసరించి కష్టదశకోర్వక, దుఃఖరస ముట్టిపడులాఁగున నిట్టిపుత్రికాస్మృతిని చేసిచేసి మిత్రబోధనలచేఁ దనస్వయంవ్యక్తతకనుపడ నద్దుఃఖరసంబంతయు శాంతరసంబుగ మార్చి లోకోప

కారకమగునట్లు స్మృత్యంతమున నొక కొన్ని పద్యములు శాంతి వైరాగ్యప్రధానంబుగఁ బఠించి సహజసిద్ధంబగు తన యయ్యుపేంద్రుని కైంకర్యంబు నవార్యంబుగ బ్రకటించుకొని మనస్సమాహితుఁడయ్యె. తొల్లియిట్లే పండితరాయలు భామినీ విలాసమును, వ. సు. రాయఁడు సతీసుత స్మృతులను, వ్రాసి శాంతింబొందిరి. అందులకుఁ దార్కాణగా నీకవి పుత్రికాస్మృతిఁజేసి శాంతి రసప్రధానుండయ్యెనని తోఁచుచున్నది. ఇందువలన దుఃఖవైరాగ్య మార్గములిట్టివని లోకమునకు బోధపడకమానదు. పండితులిందలి గుణాగుణంబుల గైకొందురుగాక.

ఇట్లు విధేయుఁడు,
కురుగంటి సూర్యనారాయణ శాస్త్రులు,
క్వీన్ మేరీ గవర్నమెంటు యిండియన్
గరల్సు హైస్కూలు ప్రధానాంధ్ర
సంస్కృతోపాధ్యాయుఁడు,
విశాఖపట్టణము



శ్రీ

# పుత్రికాస్మృతి.

శా॥ నీసంకల్పము లిట్టివంచెరుగరా, నీరేజగర్భాదులున్
నీసర్వజ్ఞత యద్వితీయము, భవన్నిత్యప్రభావంబుధీ
వ్యాసాగమ్యమఖండమూర్తివి జగన్నాథా! నన్ను నేటికీ
వ్యాసంగంబునఁ దేల్పఁజూచితె? నిన్ను ధ్యానించెదన్నిత్యమున్॥

—♦ జననము ♦—

| | | | |
|---|---|---|---|
| బుధ ౯-౧౧ | ర చ ౫-౬ | కే ౪ | శు ౭ |
| | భరణీ ద్వితీయ చరణము. | | |
| | | | ల ౪ |
| శ ౪ | గు-రా ౯ ౧౦ | | |

సీ॥ శార్వరివత్సర చైత్రకృష్ణంబున
నమవసగడచి పాడ్యమగుతిథిని (29-4-00)

భరణీతారాయుక్త భానువారంబున
నపరాహ్ణవేళ సూర్యాధిపత్య
సింహలగ్నమున నంచితసూర్యహోరను
జనియించితివి నీవుజాతకమున
తనుభావపతి ధర్మమునశశితోనుండ
సౌమ్యుఁడు కుజుఁడు సప్తమమునుండ

గీ॥ గురుఁడు రాహువునాల్గిఁటఁ గూడబుద్ధి
యందు శనియును భృగుపుత్రుఁ డాయమందుఁ
గర్మమునఁగేతువుండ యోగ్యఫలసిద్ధి
లభ్యమగునండ్రు జోస్యులు లక్ష్మిబాయి ! ౨

—♦ బాల్యము ♦—

ఉ॥అందవుఁదొట్లలోమెఱుఁగునప్పుడుతల్లిరో!'దాయిదాయి'యం
చుం దమిఁగేలుసాప నునుసొట్టలుబుగ్గలఁదోఁప నవ్వుచుఁ
గెందలిరాకుసోయగము గేరెడుచేతులనెత్తికుల్కు ని
న్నుందిలకించిపొంగెడు ననుఁ విడనాడితటమ్మ! కూఁతురా!॥3

చ॥తలుకుమెఱుంగుగజ్జలరొద ల్చెవిపండువుఁగూర్పముంగయిఁ
బాలుచుపసిండివత్తులొరవుల్ నెఱపఁ దమిఁ బ్రాఁకునాఁడు నీ
చెలువముఁజూచి ముచ్చటలు సెందినకన్ను లుదశ్రుపూరని
స్తులములుగాఁగ నిన్నిటులఁజూడగనయ్యెఁగదమ్మ!కూఁతురా!॥

చ॥ తడఁబడి లేచియాఁచికొని తప్పటడుంగులువెట్టుచున్నడుఁ
బెడఁగడరంగవచ్చి కనువిందుగ ముందఱనాడుచుండున

ప్పుడు నినుఁ బాసి కేళిఁ బలుముచ్చటలన్ దిలకించి పొంగు నా
యెడఁదయిఁ కెట్లు నేఁడిది సహించును దెల్పఁగదమ్మ! కూఁతురా!॥

చ॥ అలరుపుటంబులన్ గెలుచు నబ్రపుఁ గెంపెదవుల్ మిటారమున్
గులుకఁగఁ బంచదార పలుకుల్ వెదఁజల్లఁగ "నత్త, తాత" యం
చలతియలంతిపల్కుల నొయారముగాఁ బలుకంగ విన్న పీ
నులకట! దుఃఖవార్తవిని నూల్కొనఁజాలునటమ్మ! కూఁతురా!॥

చ॥ పెదవిచివుళ్ళ చెంత ముఱిపెంబుగఁ బన్మొలకల్ గనంబడన్
బోదలెడు లేఁతనవ్వు నును మోమున కందముఁ గూర్పఁ దేనియల్
సెదరఁగ ముద్దుమాటలు వచించెడు నీ చెలువుం దలంచినన్
మదియిఁక వేయివ్రక్కలయి వ్రగ్గకయుండునటమ్మ! కూఁతురా!

చ॥ కడియములన్దియల్ మెఱుఁగు గజ్జెలు పాదములందు మ్రోయగాఁ
దడఁబడి కేకిసల్గొనుచుఁ దారుచుఁ గేరుచు ముద్దులొల్కఁగా
నడచుచు లేఁతనవ్వు వదనంబున గొండొక చెల్వుఁ గూర్పవ
చ్చెడు నినుఁ గాంచి సమ్మదము జెందుట లెన్నఁడొ! సెల్లెఁ గూఁతురా!

చ॥ కళుకు పసిండివత్తులు నిగారములీన నవాంగుళీప్రవా
ళలలితకాంతులబ్బురములన్ జిలుకన్ నునుఁ గేలుదమ్మి సొం
పలరఁగఁ జూచి కజ్జములనల్లన వేఁడెడు నీదు ముద్దు చె
య్యులు దలపోసి చిత్తమున నోర్వఁగ శక్యమటమ్మ! కూఁతురా!

చ॥ కరయుగళంబునన్ నులుమఁ గన్నుల కాటుక బాష్పపూరముల్
బెరసి మొగంబునం దలమ బింకపుఁ గోపపు ముద్దుచూపుల
బ్బుర మొడఁగూర్పఁగాఁ జిఱుతపోరిడి చిందులు ద్రొక్కునాటి నీ
ముఱిపెము నూచి పొంగుమము ముంచితె! నేఁడు శుగబ్ధి కూఁతురా!

## —• విద్యాభ్యాసము •—

ఉ॥ వచ్చెనొ లేదొ పంచమపువర్షము నాఁడగు ప్రాయమందె నీ
కచ్చుగ విద్దెలన్ గఱప యత్నము సేయుచు భారతీసము
ద్యచ్చరణాంబుజద్వయ సమర్చనసీచియు కేలఁ జేయుచో
హెచ్చినప్రీతిఁ గన్నకనులేయవె నాయివి! ముద్దుకూఁతురా! ॥

చ॥ ఎదఁదలపోసి బాలికలకీపురమందునఁ బాఠశాలతా
నొదవినయేని కోరినటులొప్పిదమై సమకూరునిందు మీ
చదువునకంచుఁ గష్టములు సైచి ఘటించితిఁ బాఠశాల నా
మదినదిదోఁచినన్ వగపుమానఁగఁజాలునటమ్మ! కూఁతురా! ॥

చ॥ పలకలుపుస్తకంబులును బాణితలంబునఁబట్టి ముద్దునన్
బలుకుచుఁ బాఠముల్ వెరపునన్మది వల్లనవేసికొంచు నె
చ్చెలులనుగూడి ప్రొద్దునను చెన్నలరన్ బడికేగునట్టి నీ
చెలువుదలంచుకొన్న వెతఁజెప్పఁదరంబటె! ముద్దుకూఁతురా!

చ॥ వెరపునమోమునందు నొకవింతతెఱంగు చెలంగ నొజ్జలన్
దరసితదాక్షచేత పఠితంబగుపాఠము నొప్పగించి యు
త్తరపఠనీయమున్ గొని హితంబుగ స్కూలుననుండు వేళ నీ
మురిపెముఁగాంచి పొంగుదినముల్దలపోయఁగఁజాలఁ గూఁతురా!

చ॥ పలుమరునున్ని దారముల బంతులుగుట్టుచు వింతవింతరం
గులఁబలుక్రొత్తచందములుగూర్చుచుఁ జొక్కపుఁగుట్టుతీర్పులన్
వలఁతితనంబునేర్చి జతవారలలోఁ గడుమెచ్చుగన్న నీ
యెలమిదలంచుకొన్న మదినేగతిసైపగవచ్చుఁ! గూఁతురా! ॥

ఉ॥ అందమువీరా ఁగా శ్రుతికి హార్మోనియమ్ము ఘటించి తేనియల్
చిందగఁ బంచమ శ్రుతిరుచింపఁగ సుస్వరగీతవర్ణముల్
పొందుగనభ్యసించుతతి ముచ్చటగాఁబలుకుంబొలంతి రూ
పొందినమాడ్కి నిన్నుఁగని యుల్లముచల్లఁగనుంటిఁ గూఁతురా!

చ॥ హరుమొనియంబు మెట్లపయి నందపుజాజుజగానిగారముల్
పొరయఁగనంగుళీకలనముల్ ఘటియింపుచు మేళవించి సు
స్వరమునఁద్యాగరాజుకృతిఁ బాడెడుచో నినుఁజూచి నాపయిన్
గరుణనువచ్చుభారతినిగాఁ దలపోయుదుఁగాదె! కూఁతురా!॥

ఉ॥ ఎక్కడనుంతుహార్మోనియ మెక్కడవీనులనిండియున్న నీ
చొక్కపుగానమాధురిమ జొబ్బిలు తేనియ గుమ్మరింతు నిం
కెక్కడఁజూతు నప్పలుకుటింతిసమగ్రశుభావతారమై
చక్కఁగఁదోఁచునిన్ను మది సైచియిఁ కేమిటనో ర్తుఁ గూఁతురా!॥

చ॥ వలతితనంబుఁదోఁచు చెలువంబగునీదగు చేతికుట్టునన్
మొలచినరీతి నాకులును మొగ్గలుపూవులుకాయలొప్పలన్
గులికెడుశాటికల్ గనిన గుండెలు వ్రీలి తలంపులన్నియున్
కలఁగినశింపకున్కి శిలగాఁదలఁతున్ హృదయంబు; కూఁతురా! ॥

ఉ॥ వారకస్త్రీలకున్ జదువవశ్యమటంచుఁదలంచినందుకున్
గోరికదీర బాలికలకున్ వెతక్షోరిచి పాఠశాల చే
కూరిచినందుకున్ జదువుకొంటివి నీవనియుబ్బినందుకున్
దీరిచితే; ఋణంబు! కడ తేర; నిఁకేమనఁ నే ర్తుఁ! గూఁతురా ! ॥

శా॥ విద్యాదేవతవీవుగల్గ నిచటన్ వృద్ధింగనెంజాల నీ
విద్యాశాలయటంచు బాలికలు దద్విద్యాగురుల్ పొదులున్

సద్యస్సమ్మదములైరి నీవుదివి భాషాయోష సేవింపఁగా
నుద్యోగించిచనంగఁ జాలననుతాపోపేతులై రందరున్॥ ౨౧

## వరాన్వేషణము

చ॥ కలదొకవార్త పుత్రికకుఁగాంతునిరోయఁగఁదండ్రికెంత యో
నలుగుడుగల్గునంచు నదినాయెడసార్థకమాయె; రూపరే
ఖలుగలనీకు యోగ్యతనుగల్గువరున్వెదకంగ, నందునా
యలయికయింతదీరసిదె యంతయుదీర్చితటమ్మ! కూఁతురా!

ఉ॥ ఎన్నిదినాలుగ్రుమ్మరితి నెందఱినెందఱివేఁడుకొంటి నే
నెన్నిపురంబులన్ దరిగి యెన్నిశ్రమల్ సహియించికొంటి ని
కన్నిటఁదుల్యుఁడౌవరునకై; లభియించెనొ లేదొ! దానినా
కన్నులుచల్లఁగా గనుటకైనను లేదుగదమ్మ! కూఁతురా!

చ। తనయలుపుట్టరాదు తలిదండ్రులకున్ మఱియాఁడుబిడ్డకై
గొనబుల నెన్నియెన్ని సమకూర్పవలెన్, దగుభర్తఁగూర్పఁగా
ననవరతంబుఁ జిత్తమురియాడుట యెంతనిచెప్పవచ్చు సి!
కొనకిదిదుఃఖమో సుఖమొ గూర్చునెఱుంగఁగరాదు కూఁతురా!

సీ॥ అప్ప్రతివారల యన్వయంబరయ స
త్సంప్రదాయమ్ము యశస్సమేత
మనుచువిచారించి యధికయత్నమ్మున
గోరినివ్వారింటి కోడలుగ నో
నర్చియానందించినందుకు నీయత్త
వారింటిపూర్వుల తీరుఁదప్పి

పోకుండనీభర్తక్ కీకడరెండవ
పెండిలియోగంబుపెట్టి మాకు

గీ॥ నారసేరని కడుపుఁజిచ్చుంటఁగట్టి
భర్తకు వియోగదుఃఖసంభ్రమముసుట్టి
తలఁపులోన త్తగారి కు త్తలమువెట్టి
యట్టె నిముసంబులో మాయమైతె! తల్లి! ౨౫

## —♦ వివాహము ♦—

ఉ॥ ముద్దులపట్టిపెండ్లియని ముచ్చటతో ధనమెట్లొకూర్చి నేఁ
దద్దయునాసతో సముచితప్రథితోత్సవముల్ సుహృజ్జనుల్
పెద్దయునుల్లసిల్లఁగడుఁ బేర్మినొనర్చితి నాటియారటం
బద్దిరతీరదయ్యెఁ దుదికంతయువ్యర్థమొనర్తె కూఁతురా! ౨౬

చ॥ మురుగులునుంగరంబులును ముచ్చటసేయఁగఁబచ్చగాజులన్
హారితమచుల్ బెనంగొనఁగ నందములొల్కెడునీదుకేలుదా
మరవరుచేతఁబెట్టి పరమార్థముఁగాంచితినంచుఁబొంగితిన్
మఱువఁగరాదు నాటిపరమప్రియమెన్నఁటికైనఁ గూఁతురా!॥

## —♦ రూపము ♦—

చ॥ కళుకుపసిండిచొక్కటపుఁగాంతులొగిన్ వెదఁజల్లునీదుమై
తళుకులలోనఁగాంచనకృతంబగుభూషణపాళి ప్రొద్దుముం
గలినునుదీపపుంగలికఁగాఁ గనుపించునటంద్రుడు నాదుక
న్నులలరఁజూచి సంతసిలనోఁచకపోతిఁగదమ్మ! కూఁతురా!॥

చ॥ నునుమెరుఁగానిదువ్విసుమనోహరమాజడవైచి పూసరుల్
గొనబుగఁజుట్టి నాగరపుగ్రొందళుకుల్ విలసిల్ల నెమ్మొగం
బునఁదిలకంబుదిద్ది రవభూషణముల్ మెరయంగ నీవుని
ల్చినఁ బలుకుంబడంతి కృపచేననుఁబ్రోవఁగవచ్చెనంచు నా
మనమునసంప్రమోదమునుమాటికినొందుదుజమ్ముకూఁతురా!

—• అత్తింటికంపుట •—

ఉ॥ సారెలుచీరలున్ గలిమిచక్కటితో నరణంబులిచ్చి నా
కోరికదీరబొమ్మ సరకున్ గొనియిచ్చియు నత్తవారియి
ల్సేరగనంపి నెవ్వగలుచిత్తమలంపఁగనుంటినిప్పుడే
తీరుననోర్చి యుల్లమును ద్రిప్పుదుఁజెప్పఁగదమ్మ! కూఁతురా! ॥

మ॥ మునుపత్తింటికిఁబోవఁగాన్కలిడి సమ్మోదంబుతో వీడుకో
ల్గొనిపోరే! యిపుడట్టినెచ్చెలులు కన్గొల్కుల్న బాష్పంబులన్
దనుకన్ నిన్గడసారివీడ్కొలుప బిడ్డా! వచ్చియున్నారు నీ
కనులన్ జూడఁగ రాదఁటే! తగునఁటే! కాఠిన్యమిట్లూనఁగన్॥

—• గుణసంపత్తి. అత్తయందలి భర్తయందలి భక్తి •—

చ॥ కనఁబడెధర్మశాస్త్రములఁ గామినియత్తనుదల్లిఁగాఁగ భ
ర్తనుతనదైవమంచు నెడఁదన్ దలపోయుటయొప్పనంచు దా
నినిపుడు సార్థకంబుగను నీనడతంగనుగొంటినింక నా
కునుగడుకీర్తిఁగల్గుననుకొంటిని నమ్ముకయుంటిఁ గూఁతురా!

చ॥ సరసిజగేహయత్తయలశారదకోడలుగాన వారలి
ద్దఱునొకచోటనుండరన ధారుణినెవ్వరు నత్తయింటికో

టరమునఁగల్గ లేకమనుటం గనఁజాలుదుమట్టిచోట నీ
వరసుగుణాప్తి యేమనఁగవచ్చును నీయెడ నత్త నత్తపై
నరుదుగ నీదు ప్రేమఁగని యందఱు నద్భుతమంద్రు కూఁతురా!

చ॥ పెనిచితి మేము నిన్నుఁ గడుఁ బ్రీతిఁగ నత్తిలు సేరునంత మా
పెనుపునకంటె నెక్కుడుగఁ బెంచెగదే నిను నత్త నీదు క్రొ
న్నెనరును నీవిధేయతయు నీసుగుణంబులు సూచి నిన్ను నా
ఘనతరగర్భరత్నమని గాటపుఁ బ్రేముడిఁ గంటి, కూఁతురా! ౩౮

ఉ॥ చిన్నతనానఁ జిత్తమునఁ జిక్కఁగ నెక్కొనె దైవభక్తి నీ
కెన్నఁగఁ బ్రాయమెచ్చినపు డీశుఁడు భర్తయె సాధ్వికన్నమా
టన్నె యనవిమ్మ సుంతయుఁ దడంబడ కుత్తమభక్తిఁ జిత్తమం
దున్నలకొల్పి నిండుమదితోఁ బతిఁగొల్చితివమ్మ కూఁతురా!

చ॥ కఱకుఁదనాన నెక్కయెడఁ గట్టిఁడియై పతి యాసడించినన్
మెరమెర లేక యుల్లమున మెల్లఁగఁ బల్కుచు సమ్రభావవై
గురుతరభక్తితో మెలఁగి కొల్చితివీసుగుణాంబురాశి క్ర
మ్మఱ లభియించునే; పతికి మాకు! నీ కెక్కడిమాట! కూఁతురా!

చ॥ కసరుచు భర్త కోపగతి గ్గైకొనినప్పుడు భక్తియుక్తిఁ బెం
పెసఁగ వినీతవేషవయి యెంతయు నోర్చి తదాభిముఖ్యమే
యసదృశమౌ వరంబనుచు నాత్మఁదలంచి మెలంగునట్టి నీ
దుసుచరితంబు గాంచి పొలఁతుల్ నుతియింతురుగాదె! కూఁతురా!

చ॥ చదివితివీవు గ్రంథములు సాధ్వి తెఱంగిదియంచు నట్టి నీ
చదివినయర్థమంతయుఁ బ్రశక్తిఁగ నాచరణంబుఁ జేసితీ

సదమలబుద్ధివై భవము చక్కఁగనెక్కడదక్కె నీకు మా
సదనమువన్నెకెక్కనని చాలఁగనమ్మితినమ్మ! కూఁతురా! ౩౮

చ॥ కనఁబడెనొక్కొయివ్విధముగా నిఁకనెక్కడనైన నత్తపై
ననుపమభక్తి నత్తఫలహారముసేయకయూరకున్న నే
నునుభుజియింపనంచనుట నూతనమిట్టిచరిత్ర మిన్నిమే
ల్గొనములునేర్చి మమ్మిటులఁ గుందుఁడటంచనిపోవనాయమే॥

మ॥అనురాగంబునభక్తియుక్తియువిధేయత్వంబపూర్వంబుగాఁ
దనరంగొల్చితిభర్తఁ నిక్కువముగా దైవంబటంచిప్పు డా
తనికీవేమనిచెప్పిపోయితివె! నాతల్లీ! మనంబందునే
యనుమానంబిడికొంటివో తెలియరాదయ్యెఁ గుమారీమణీ!

మ॥ నినునత్తింటికిఁబంచువేళనెవియేనిన్ గోరునవ్వస్తువుల్
గొనితెప్పింపఁగఁ గొన్నిరూప్యములునీకుఁ జేతిలోఁబెట్టఁగా
ననురాగంబునభర్తకిష్టమగు నాయావస్తువుల్ తెచ్చికొం
డనియర్పించితివట్టిప్రేమ యిపుడేమైపోయెనే భర్తపై॥ ౪౧

—• సౌభ్రాత్రత •—

మ॥ తినుబండాలములేమితెచ్చినను బుత్రీ! నీకు నీయక్కకం
చనిచేఁబెట్టినఁబిల్చి యక్కకును మేలౌవానిమున్నిచ్చి యా
వెనుకన్ గల్గినదీవుగైకొనుదు నీవిన్నాణమున్ సౌహృదం
బును సౌభ్రాత్రతనీదుసొమ్ములనిమెప్పున్ మెచ్చుకొండ్రందఱున్॥

## —♦ బీదలయందలి దయ ♦—

శా॥ బీదల్సాదలుకుంట్లుగ్రుడ్డులునునా భిక్షాటకుల్వచ్చినన్
మోదంబాదరమున్ జిగుర్పఁ బను లెన్నో యుండినన్ మాని వే
వేదన్దీనులఁ జేరి చేకొలఁదిగా బిచ్చంబులం బెట్టెదీ
పీదాక్షిణ్యము నీదు సొమ్ముగదవే యేమందునో పుత్రికా ॥

## —♦ సౌజన్యత ♦—

మ॥ కలుపుంగోరుతనంబు సౌమ్యతయు నిక్కంబెన్న నీసొమ్ము లే
యఁలకుగ్లర్ దొరసాని నీవలనఁ గాదా మాపయిన్ సాదరా
కలనన్ జూపి మెలంగు పెల్ల! మగువంగా వచ్చునే; యెన్ని జ
జ్మలకైనన్! నినువంటి కూఁతురు లభింపన్ గల్గునే! నాకిఁకన్॥

## —♦ గర్భవతియగుట ♦—

శా॥ ఇంతుల్సంతసమంద శైశవమునందీడేరి తత్తత్క్రియా
సంతోషంబొడఁగూర్చి గర్భవతివై సంప్రీతిమాతాపితృ
స్వాంతంబుల్దౌహిత్రప్రసూకలితలాభప్రాప్తిఁగాంక్షింపఁగా
నంతర్జీర్ణము చేసిపోయితివె! మాయాకాంక్షలన్ బుత్రికా! ॥

ఉ॥ ఎంతయు మేలు నేటికి లభించెను వేఁకటిఁదాల్చెఁ బుత్రి సీ
మంతముఁ జేయఁగావలయునంచుఁ బ్రయత్నము జేసి సమ్మద
స్వాంతతఁ గూర్చువస్తువులు పైతృకకర్మలకయ్యె నిట్లుదు
శ్చింతలఁ గూర్చు మాలవిధి సేఁతలు అంపపుకోతలయ్యెఁగా! ॥

### ఫొటో

శా॥ నీయక్కన్ నినుఁ బూఁరుషాకృతులుగా నేఁ ఫొటోగ్రాఫున్
దీయన్ జేసి తదీయబింబములఁ బుత్రీపుత్రభావంబునన్
నాయొద్దన్ దగనిల్పుకొందు నెపుడున్ నాతల్లి! నేఁడా ఫొటో
నే యోర్మిన్ గనుగొందు నెట్లుమది సైరింతున్ భరింతున్ సుతా!

### కోర్కె తీర్పలేమి

ఉ॥ మామిడిపండు నీకు నతిమాత్రముగాఁ బ్రియమం చెఱింగియున్
వేమరు నీవు తెమ్మనుచు వేఁడు టెఱింగియు గర్భిణీమనః
కామితసిద్ధి సేఁతవిధిగాఁ గనెఱింగియుఁ దెచ్చి పెట్టలే
కీమెయినుంటి, నీకతన మేమిటవచ్చెను! ముద్దుకూఁతురా! ॥ ౨౮

ఉ॥ చాలియు నీదు కోరిక వెసన్ గొని తీర్పఁగ లేక తేఁకువన్
మాలిన నేను ముట్టనిఁక మామిడిపండిల గల్గినంతకున్
బేలతనాన నేమిదల పెట్టిన నీదగు కోర్కెఁ దీర్పఁగాఁ
జాలుదునా! యిసీ! కలుషజన్ముఁడ నేమనుకొందుఁ గూఁతురా!

### అనుతాపము

ఉ॥ జ్యోతిషమందునన్ ఫలము లూర్జితలీలవచింత్రు పెద్దలే
రీతిని నమ్మవచ్చు? నవిరిత్తమనోభ్రమగాక; మున్ను నీ
జాతకమెల్లఁ జూచి ఫలసంగతి గాంచియు వారు చెప్పిరే!
యాతఱి నీకు మృత్యువు ఘటిల్లునటంచు నొకమాట! కూఁతురా

ఉ॥ దూఱఁగనేల! శాస్త్రములదుందుడుకుందనమోర్చి పెద్దలన్
సారెకు నాడనేల! గతజన్మమునం దెటువంటి పాపమున్
గూరిచికొంటిమో! యిపుడు కూడకవీశునె కర్మతంత్రముల్
నేరుతురే? తొలంగిచన! నిర్జరులేనియు ముద్దుగూఁతురా! ౫౧

మ॥ పదునాల్గేఁడులు ముప్పదేడుదినముల్ భద్రస్థితిన్ మమ్మున
మ్మోద వారాన్నిధినోలలార్చియునపస్మారంపుటానంద యం
దదయ జ్యేష్ఠగ శుక్లసప్తమిని నయ్యాదిత్యవారంబురే (31-5-14)
యిదివిన్ జేరితె దుఃఖవారినిధి మమ్మెల్లన్ బడన్ ద్రోయుచున్!

మ॥ రవివారంబున సూర్యహోరనల మార్తాండానుపాల్యంబులే
యవిలగ్నంబున నుద్భవంబయితి వోరాజన్మ సంబంధ జా
త విశేషంబది యెట్టిదో రవిదశన్ దద్భాను వారంబునన్
దివికిన్ జేరితి వెంతచేసె ఖలుఁడో తిగ్మాంశుఁడో పుత్రికా! ౫౩

మ॥ పదునాల్గేఁడులు ముప్పదేఁడుదినముల్ ప్రాయంబు, నత్తింటనీ
వదసంగాపురమైదు మాసములు చేయంజాలి తార్నెల్లుదా
హృదభారంబటఁ గష్టపాటువడ రెండేనాళ్లు, గర్భచ్యవం
బదికాలుంగడె, జీవవిచ్యుతి నిమేషార్ధంబె హా! పుత్రికా॥ ౫౪

మ॥ కనులన్మోడ్చిన నీపయిన్ గల మనఃకంపంబుగాఁ దోఁచినన్
నిను నమ్మా! యనిపిల్చి చెంతనిలువన్ నిల్వంగనుల్వడ్డ మా
డ్కని బల్కెదగనీవుకన్గొనిన చూడ్కిన్ గన్న నాగర్భ మం
దనయంబారని చిచ్చువోలెఁ గుదురై యారాటమున్ బెట్టెడున్॥

మ॥ పలుకంజాలని నీదుచూపుఁగని హృద్భగ్నంబుగా వేగవై

ద్యులకై పర్విడి వాయువేగమున నేఁ దోతెంచు నాలోనఁ గ
న్నులలోఁ జిచ్చులువెట్టిపోయితివి నన్నుం,గన్నతండ్రిం దుర్భ
లులకై నంజెవిఁ వేసి పోవ నకటా భారంబుగాఁదోఁచెఁగా॥ ౪౬

క॥ నీవే సంసారసుఖము
నీవే తనమేలటంచు నిక్కముగా సం
భావించు తల్లిదుఃఖితఁ
గావించి చనంగ నీకుఁ గా ళ్ళెట్లాడెన్?॥ ౪౭

శా॥ ప్రేమావేశమపారమై పెరుగఁబేర్మిన్ గూడి యాజన్మమ
త్యామోదంబున నెట్టివేళలను బాయన్ లేక యేకాకృతిన్
నేమంబొప్ప మెలంగుచుంటిరిగదా నేఁడట్టి మీయక్క యా
రామాబాయికి నేమిచెప్పిదివిఁ జేరంబోయితే! పుత్రికా! ౪౮

మ॥ కనఁబాలియ్యఁగనమ్మవం తవల నంకస్థాయిలన్ జేసి మి
మ్మనురాగమ్మున రేబవళ్లు మలమూత్రాదుల్శరీరంబునం
దినుకన్ శైశవమాది పెంచికొని మిమ్మెల్లప్పుడెల్లారుము
ద్దనుచున్ జూచుచు నుల్లసిల్లుమది మీయమ్మమ్మనుం బాసిపో
మనసెట్లొప్పెనో! యేమిచెప్పిచనితే! మాయమ్మరో! చెప్పవే!

చ॥ కవలగుమిమ్ముఁ బెన్నిధులఁగన్న తెఱంగునఁజూచుచున్మహో
త్సవమునరామి లచ్చియని జంటఁగఁబిల్చుచు బాల్యమాదిలోఁ
దవిలినప్రేమఁ బెంచుచు సదా యెడబాయని మాయమ్మ కేమి చె
ప్పివిడిచిపోయితమ్మ యిటుపెట్టిద మేటికిఁ జేసి పోయితే॥ ౫౦

చ॥ అలరుచుజంటయందొకతె నక్కునఁదాలిచి బారసాలపీ

టలపయిఁదల్లియుండ నికటంబున నిన్నొడివెట్టి యక్కయ
వ్వలవసియించెఁ బిన్నతలి, భావమునందిదియెంచియైన నే
పలుకునుఁజెప్ప కేగితివి భావ్యమటే! యిదినీకు పుత్రికా! ౬౧

మ॥ నయగారంబునఁగన్న పుత్రికలకన్నన్ మిన్నగానెప్డు మీ
పయిగారాబముఁజూపు తాతయనిపిల్వన్ లోనఁ బెల్లుబ్బఁబ్రా
పయియత్తింటికి బంపునీబడినతోడై వచ్చెఁగా యట్టిరా
మయతాతన్ దుదిఁబల్కరింపక జనన్ మాయమ్మనాయమ్మటే

మ॥ సారిదిన్ దానెటునుంచియేని ప్రియవస్తువ్రాతమున్ దెచ్చినన్
మురువొప్పారఁగఁదల్లులార! యని మిమ్ముంబిల్చి మీకిచ్చి వె
న్కరహిన్ బిడ్డలకిచ్చు నాగయ ప్రయాణక్షిప్రవై యున్న నీ
తెఱఁగున్ గన్గొనిపిల్వఁ బల్కకయెపోతే! పుత్రి! న్యాయంబటే!

తే॥ గీ॥ నాదుచెలికాఁడు నాయొజ్జ నాదుహితుఁడు
సాంబశివకవివచ్చి లచ్చుమ్మయెక్క
డనఁగ నేమనిచెప్పుదు నతనికెట్లు
చిత్తశాంతిఘటింతునో చెప్పుమమ్మ॥

ఉ॥ ఇంపుగనీడుజోడయి పఠించినయట్టి వయస్యలందరున్
గుంపులుగూడి నిన్నిపుడు కూర్మికనుంగొనవచ్చినారు నీ
వింపుగమాటలాడి కనవేమిది సెల్లునె వారికన్నులన్
అంపిలిబాష్పబిందువులు రాలెడుఁజూచితె! జాలిలేదటే! ౬౫

ఉ॥ పుట్టినయప్పుడేయునురు బొందిని లేదని చెప్పిరంతలో
నెట్టులొవచ్చెనంచనిరి యిన్నిదినాలిటులద్దుముద్దులన్

బట్టుగఁజూపి యీకపటనాటకమాడి తుదిన్ మదాశయం
బట్టెదురంతదుఃఖవిపులాంబుధిముంచి జుణంగిపోతివే॥ ౬౬

చ॥ నిలిచిననూర్పులంగములునీల్గకయట్లనెయుండె, మోమునన్
గలకలలాడుసొక్కుకళ గాటముగాఁగనుపట్టుచుండె, నె
వ్వలననుబ్రాణహీనతనువల్లిక వంచనగానియట్లుగా
వెలసితివెంతపుణ్యవతివే! కడునద్భుతమయ్యెఁ బుత్రికా!

సీ॥ నీదుతల్లికిఁబ్రియోన్మేషంబుచేఁబుట్టి
నింటివారనగారవించునట్టి
కల్వపూడిపురంబు కమ్మవారలునీదు
చెలియలిపెండిలి చేసినంత
నచటికిఁగొనిపోయి యాదరించిననాఁడు
నీవుసరస్వతీదేవివి
హార్మోనియంబున నమృతప్రవాహముల్
పారయుంగ గానమాధురినిఁజూపి

గీ॥ యచటివారలహృదయంబు లతులసంప్ర
మోదమగ్నంబులనుజేసి సాదరముగ
వారిమెచ్చులగంటివా తీరునేఁడు
తలఁచికొని నిల్వఁగలనె నాతల్లి కాన! ౬౭

ఉ॥ హార్మోనియంబుమీఁదరుచిరాంగుళముల్ నటియింపదత్స్వరాం
తర్మిళితాత్మగానముసుధారసధారలువెల్లిగొల్పఁగా
నిర్మలగీతిఁబాడునెడ నిన్నలభారతియేయటంచు నే
నర్మిలిగందు నాప్రమదమంతయు నింకగఁజేసిపోయితే॥ ౬౮

చ॥ ఒదవిసుధాప్రవాహకలితోర్మికలై చెవులాని చిత్తస
మ్మద మొనరించు గానరసమాధురి నేఁడుదలంచికొన్న చోఁ
జెదరకపొంగిపొంగి వగచిచ్చునబగ్గనిమండు మంటలై
పొదలియలంపఁజొచ్చెఁగదపుత్రిక ! యేగతినేసహింతునే ! ౨౦

ఉ॥ నేనొకనాఁడు వ్రేకిఁగొని నెమ్మదిఁజెందినవేళ నిద్దుర౯
బూనకయుండఁగానుబుసుపోకకు నీవును నేనురాముఁడు౯
మానుగగవ్వలాడునెడ నచ్చికఁబందెముగచ్చి చెప్పు నీ
లేనగుమోముచిత్తఖురళి౯ విడదెన్నటికైనఁ బుత్రికా ! ౨౧

మ॥ కవలై పుట్టినమిమ్ము గీర్వనిత సాక్షాత్పుత్రికా రూపమై
యవతారంబొనరించెనంచరసి విద్యాప్రాప్తికై పాఠశా
ల విశేషశ్రమకోర్చి మీకొరకు నిల్పంజాలితి౯ దానఁజే
సి వధూలోకము విద్యపేర్మిఁ గననేర్చె౯ మీరువిద్యావివే
క విలాసంబులు సూచినాతలఁపుజోక౯ బండెనంచుంటి నా
యవలేపంబడుగంటఁజేసి చనితే! హాపుత్రికారత్నమా॥ ౨౨

చ॥ పెరడుననీవునాటి తగఁబెంచెడు మల్లియయంట్లు జామ గ
న్నెను మొదలైన మొక్కలును నేటికిఁదల్లిని వీడుబిడ్డలై
దురపిలి వాడువారె నవిదొడ్డిఁ గనుంగొనఁ గన్నులంటు పెం
దెరలయి యశ్రువారి జనుదెంచెడువానిని దడ్పగానొకో॥ ౨౩

సీ॥ కవలు గల్గితిరి తొల్కాన్పున నవ్వాల
పుత్రిక లిరువురు పుట్టిరిగద
మీతల్లి దౌహృదోన్మేష భారముఁదాల్చి
చరియించుటది మూడుసార్లుగానఁ

దగమూవురు కుమారితలు సుఖమున్నార
లధిక మాసంబట్లయైతి నేను
నాయున్కి తగదని ధీయుక్తి నెన్నితి
వో యకస్మాత్తుగఁ బోయితయ్యొ

గీ॥ నీతలంపా దైవంబునిర్ణీతి యిట్టి
దో యెఱుంగ లేమెంత యొత్తుకొనియేడ్వ
గండ్లఁజూడవు పలుకవీ కటికఁదనము
పాదుకొని నిట్లుచెప్పవే నీదుమదిని॥ ౭౮

ఉ॥ గారవమారఁ దేనియలుగారఁగ "నాన్న" యటంచుఁబిల్చియా
చీరలు నాకుఁదెమ్మనుచుఁ జెప్పిన ముద్దులపల్కులక్కటా
యారనిచిచ్చులై కడుపునందున నెక్కొనియొక్క వీఁకున౯
దీరనివంటలై వెతలఁ దేల్చెడు నెట్లుసహింతుఁ బుత్రికా! ౭౯

సీ॥ ఐదేండ్ల పాయమందంగ వల్లిక గజ్జి
లేచి బాధింప లాలించుకొఱకు
నినుభుజంబున వైచికొని రేలుదిరుగుచో
ననుఁగని నన్నెత్తికొని మెలంగఁ
జాలవునాన్న న౯జంక నెత్తుకొనంగ
విప్రాంగనను దేరవేయొకర్తు
ననఁగ నెవ్వరువత్తురన గుడివాడలో
నున్నారు వారిదెమ్మన్న నీదు

గీ॥ మాటలోఁ గోపపడి చన్నమాతృజనని
తోడితెమ్మను ధ్వనిఁగని యీడునకును

మించు నీయుక్తిఁగని పెట్టి మెచ్చుకొంటి
చిత్తమున నిప్వుడదిసోకఁ జిచ్చుదాకు॥ ౭౬

ఉ॥ పెంపుగఁబిన్న నాఁడు తినిపించితిఁబొత్తున నన్నమంతపై
మంపుగఁబెద్దవైనపుడు మానకబంతిభుజించి తెప్పుడున్
సొంపదియింకమీఁద మదిఁజొచ్చిననచ్చటిముచ్చటల్ కడున్
రంపపుకోఁతలై మరువరానియలంతులు పెట్టుకుండునే? ౭౭

తే॥ గీ॥ నోటిదిని చేతిదిని పెట్టి వాటమలర
నేఁటబెంచెడుదానిని పూఁటఁబెంచు
కొంటి మల్లారుముద్దుగా తుంటరివిధి
కంటమనుగొట్టికొనుట యక్కటయెరుఁగక॥ ౭౮

సీ॥ గారవంబలరఁగా భారతికోకపూట
చేరిపాఠంబులు సెప్పుచుండు
ప్రియముతోఁజిన్న చెలియలుశత్రుఘ్నుకి
తలదువ్వి జడవైచి యలరుచుండు
యనురాగమొదవగా నక్కతో నొకమారు
వేడుకగాగవ్వలాడుచుండు
తోడిబాలికలతోఁ గూడియొక్కొకమాట
లాగుచు గీతముల్వాడుచుండు

గీ॥ వకట నీచర్యలెంతొ ప్రియంబుసేయ
బదియునాల్లేడులే నీకుఁ బదియునాల్లు
సంఖ్యమన్వంతరంబులై జరిగనేమొ
విడిచిపోతివిగదమమ్ము గడియలోన॥ ౭౯

శా॥ మీకుద్యోగమువచ్చి హెచ్చగునెడన్ మీయింటికిన్వత్తు బా
వా! కోర్కెల్వెలయింపఁగాననుచు బావంజూచి మున్నంటివి
యా కాంక్షల్ ఫలియించుదాఁకనయినన్ హా యోర్వలేవైతివే
నీకిల్లెక్కడినుండివచ్చెనకటా నిర్వాణమిట్లయ్యెడన్॥ ౮౦

చ॥ వరగుణయుక్తవైన నినువంటితనూభవమాకు దుర్దశా
పరులకుదక్కునే! కులమువన్నియ కెక్కఁగఁ బుట్టినిల్లుభా
సురముగఁజొచ్చునిల్లును విశుద్ధయశంబుననుల్లసిల్ల స
చ్చరితమునన్ వెలంగవె! నిజంబుగ నేమననేర్తుఁ! గూఁతురా!

చ॥ నెలలుకొరంతగా నిసువు నేలబడం గడుఁదేరిచూచి క
న్నులనుదితాశ్రుబిందువులు నూల్కొనఁజింతిలితౌర పుత్రవ
త్సలతయదెంతహెచ్చొ సరసంబడియేగితిబిడ్డతోడ మా
కలరదటంచు నెంచితివె యట్టిదిగర్భఁపుఁదీపి పుత్రికా॥ ౮౨

ఉ॥ పెంచితిమిన్నినాళ్ళు కడుఁ బ్రేమనుకన్నులఁగప్పికొంచుభా
వించితిమెంతొ మాకుఁబ్రియవృద్ధియొనర్చెదవంచు నక్కటా!
త్రుంచుకపోయెగావిధి కరుక్కుననీయనుబంధవల్లికన్
మంచితలంపడాయెఁగద మాలవిఘాతృఁడు దుర్వినీతుఁడై॥ ౮౩

శా॥ డాయన్ వచ్చెడునట్లతద్దె మనయింటన్ నేఁడు నాగయ్యబా
బాయీ! యుయ్యెలవేయవా! యనుచుఁబిల్వన్వేపనుల్మానియున్
నీయుత్సాహముఁదీర్పఁ తత్క్షణమునన్ నీయట్టిగారాబమే
మాయెన్ బిల్చినఁబల్కవైతివిగదమ్మా యట్టిబాబాయికిన్॥

సీ॥ పట్టెమంచమునీకుఁ బంపలేకరణంబు
కటుకపై నిటుపెట్టి కట్టవలసె
ఘనమగుజరీచీర కట్టఁబెట్టఁగలేక
ప్రేతవస్త్రము కప్పిపెట్టవలసె
పల్లకీమేనాలు పంచిచూడఁగలేక
శవవాహనమునందు జరుపవలసె
మెత్తనిపఱుపు నెమ్మిఁగ నీకొసఁగలేక
పిడుకలచితిమీఁదఁ బెట్టవలసె

గీ॥ పరువమైనట్టి విరిమల్లెసరులొసంగఁ
దలఁపకిటు నెత్తిఁ గొఱివిఁ దాకొలుపవలసె
కటకటా! కన్నకడుపిట్టి కఠినమునకు
నోర్వఁగాఁజేసె విధి, యెంత యుగ్రుఁడయ్యె॥ 85

తే॥ గీ॥ తొలఁగెనుగదమ్మ నేఁడు నీతోడ మాగృ
హంబునందలి లక్ష్మి సత్యముగ లక్ష్మి
నీవకదలక్ష్మి బాయి! విహీనకాంతి
యయ్యె నిల్లెల్ల నీవు లేనందువల్ల॥ 86

కం॥ చిటిపొటినోములునోచుచు
చటుకున బొమ్మలకుఁ బెండ్లి సలుపుచుఁ గడుము
చ్చటలాచరించు నీకత
మటుమాయంబయ్యె నేఁడు మాకుఁగుమారీ ౮౭

ఉ॥ హాసుకుమారి! హాసుగుణ! హామణిహారమ! హానిధానమా!
హాసువృతోల్ల సత్ఫలమ! హామదుదంచితగర్భరత్నమా!

హాసముపాత్త మద్ధృదయహర్ష రసోదయమా! నిరాశుల౯
జేసి దివంబు నేఁడిటులఁ జేరితివే! ప్రియపుత్రికామణీ! ౮౮

ఉ॥ హానవపద్మకోరకమ! హానవనీతసమానపేశలా!
హానునురత్నపుందళుక! హాచిలుకా! తొలుకాఱుక్రొమ్మెఱుం
గా! ననుఁగన్నతల్లి! నవకల్పకవల్లి! యెటేఁగితిప్వుడా
హా! ననుఁబాసి, నీకుఁదగునా వగనాకొనరించిపోవుటల్ ?॥

## —• అపమృత్యువు •—

ఉ॥ మిక్కుటమైనతృష్ణ నపమృత్యువు నిన్గబళించిపోవఁగా
నెక్కడనుండివచ్చెనొకో! యీయెడఁగన్పడనేని నేనిదే
గ్రక్కున కంఠమున్నులిమి కన్నులుచీలిచి దంష్ట్రలూడ్చి పే
రుక్కున దానిపే రడపకుందునె? యొక్కక్షణంబులోపల౯॥

## —• పరలోకబంధుత •—

మ॥ పరలోకంబున కేగిన ప్డిచటిసంబంధంబుపాటించి య
క్కరతో నీకును మేనయత్తసుతయౌఁగా, సుబ్బమంజూచియా
వసుస౯• నీచెలిరాఘవమ్మఁగని తద్వార్తల్విచారించి ని
ర్భరమోదంబుననుందురో! యుచితమౌ బాంధవ్యమే పారఁగ౯॥

చ॥ పెరిమెనునిన్ను మేకొనుచుఁ బెంచెడి నీతొలియేటిజన్మవా
సరమున నీపితామహుఁడు సాధుఁడు వేంకటనారసింహుఁ డా
దరమునపాయసాన్నముఁదుదన్భుజియింపుచుఁదృప్తినొందుచు౯
సురపురినుండె తోఁడతేఁడెనూ! భయమందకుమమ్మ పుత్రికా!

## —♦ శాంతి - వైరాగ్యము. ♦—

చ॥ కడుపునఁగన్న మోహముజగంబునఁ బాయఁదరంబె కూఁతులో
గొడుకులొ పుట్టఁగానె కలుగుంగడుముచ్చట వారికెద్ది యే
బెడదతటస్థమౌనెడల బెంగమునింగెడి యేదుపేగదా
యెడదవిడం గడంగుదు రిదేమిస్వభావమొ లోకమెల్లెడన్॥

ఉ॥ వారికివీరికేమి యనుబంధమొ పుట్టినయప్డుచచ్చిన
ప్డేరునుగూడరారు మదినేచుదు రొండొరులెందుకోసమో
దూరుచు వారివీరివలెదూరితి నెవ్వఁగచిచ్చుఁ బుత్రి! నిం
డారు విరాగి తారసమునన్ నినుఁగూరిచి చల్లఁజేసితిన్॥ ౯౪

చ॥ సిరికింగాల్నిలదంచువింటి మునులక్ష్మిబాయి! నీవిప్డా
చెరియంజూపితి నీస్వభావమది యిస్సీ! చాలు నీకోసమి
క్కరణిం నెవ్వఁగగుందనేటికి విరాగస్వాంతముంగంటినిం
దరయం నా వగ నావిరాగమును మార్గాదర్శకంబౌ నిలన్॥

మ॥ జయమానంచుహరిందలంచుచునెనిచ్చల్ "తస్యవిత్తంహరా
మి"యటంచచ్యుతుఁడన్నమాటస్మృతిరామిన్గ్రమ్మునాగర్వముం
దయతో వాఁడెతొలంగఁజేసెను నినున్ దాఁగొంచునోలక్ష్మిబా
యి! యహోయాహరిమాటజ్ఞప్తిఁగొని హాయింజెందితిన్నేనిదే॥

చ॥ పరముఁదలంచువానికి నపాయమెరాదొకవేళ పూర్వక
ర్మరచనవచ్చెనేని యది మాధవుఁడప్పుడె తొల్గఁజేయుఁద
న్మరువక యున్నవానికిది మంచికెయన్కొనవచ్చు నేరికిన్
ధర సుఖదుఃఖముల్వరుస దార్కొనుఁగావునఁ జింతయేటికిన్॥

చ॥ తనువులు నీటిబుగ్గలు సదా హరిమాయ నెఱుంగ లేముపో
ఘనవిపదంధకారరవి కౌస్తుభభూషణు సేవయొండె యీ
జనులకుఁదారకంబు మనసా! మనసార మెఱింగి యింతనై
నను జెడుచింతలన్ జనక నావశమైనిలు చెప్పినట్లుగాన్॥ ౯౮

చ॥హరుఁడపమృత్యుహంత! పరమాత్ముఁడుశంభుఁడు కాశికాపురీ
వరుఁడగు విశ్వనాథుఁడు శివంకరుడై భవదాత్మశాంతిఁదాఁ
గరుణనొసంగుఁగాత మని గంగనునీతను శల్యజాలముల్
చిరముగ నిల్పఁచేసి నినుఁజెందిన కల్మషముల్ హరించి సు
స్థిరముగఁ బుణ్యలోకములఁజేరి సుఖింపుము లక్ష్మిబాయి యు
ర్వరపయి నీదుపేరు నిలువంబడ శాశ్వతకీర్తిగల్గ భా
సురతర దివ్యభోగములు చూఱగొనం గృతియొండునీకు నే
నిరవుగ నంకితంబుగ రచించెద శాంతివహింపు పుత్రికా॥ ౯౯

శా॥ లక్ష్మీంప్రాగనపాయినీం జలధిజాం లక్ష్మీసతీమగ్రహీ
ర్లక్ష్మీంమేతనయాం తథాద్య జలభృల్లక్ష్మీశుభాంగాగ్రహీః
లక్ష్మీహం తవదక్షిణా ముపనయే లక్ష్మీస్స్మృతిం సత్కృపా
లక్ష్మీప్రాగివ పశ్యతామనుచు నోలక్ష్మీశ! నిన్గొల్చెదన్॥ ౧౦౦

ఉ॥ నందగిరీంద్రుడౌనరుసు నందనుఁడన్ కవివేంకటప్పయా
ఖ్యందగువాఁడ నీకుఁ బితనై యిటు నీదగు నాత్మశాంతికై
వందురిపుత్రికాస్స్మృతి భవస్స్మృతికై విలపించి చేసితిన్
సుందరి లక్ష్మిబాయి! పరిశుద్ధగతిన్ గనుమమ్మ పుత్రికా॥ ౧౦౧

---

# ప్రకటన.

## వెలకుదొరకు పుస్తకములపట్టి. అంచెకూలి గాక.

| | | | |
|---|---|---|---|
| 1 | శ్రీమద్రామాయణాద్భుతోత్తరకాండము [అపూర్వము పారాయణోపయుక్తము రుచిరాలంకారభూయిష్ఠము 6 ఆశ్వాసములు] | | రు 1-4-0 |
| 2 | జగన్నాథీయము [వడాలిమహాత్మ్యము - అపూర్వగ్రంథము] | | 0-8-0 |
| 3 | శుద్ధాంధ్రమేఘసందేశము | విప్రలంభశృంగారము | 0-3-0 |
| *4 | ఆంధ్రీకృతమేఘసందేశము | | 0-3-0 |
| *5 | చంద్రిక [నవలాప్రబంధము ప్రతిస్త్రీపురుషుఁడుచదువఁదగినది] | | 0-8-0 |
| 6 | బాలాశతకము [స్త్రీనీతులు] రెండవకూర్పు | | 0-1-6 |
| 7 | సీతారామశతకము | భక్తిరసప్రధానములు | 0-1-0 |
| 8 | రామశతకము | | 0-1-0 |
| 9 | ఆదికేశవశతకము | | 0-1-0 |
| 10 | శ్రీశైల హనుమచ్ఛతకము | | 0-1-0 |
| 11 | బ్రహ్మపుత్రాభ్యుదయము [పౌరాణమహిమ] | | 0-1-6 |
| 12 | గంగిరెద్దు [హాస్యము] | | 0-1-0 |
| 13 | స్త్రీవిద్యాసారసంగ్రహము [వచనము] | | 0-1-0 |
| 14 | దొంగసామిచరిత్ర [నిజమయినకథ] | | 0-1-0 |
| 15 | శ్రీకృష్ణమానసపూజ | సంస్కృతము రెండవకూర్పు | 0-1-0 |
| 16 | హరిహరస్తోత్రతారావళి | | 0-1-0 |
| 17 | కనకదుర్గాస్తోత్రరత్నమాల | | 0-1-0 |
| 18 | అంగలూరు విలేజిభూగోళము | | 0-3-0 |
| 19 | షామల్లు జయధ్వజచరిత్ర | | 0-1-0 |
| 20 | పుత్రికాస్మృతి [కరుణరసభూయిష్ఠము] | | 0-2-0 |
| 21 | బాలతొడవు [అమూల్యము] | | ఉచితముగ నొసగబడును. |

* అచ్చులోనున్నవి.

వలయువారు.—

లక్ష్మీగ్రంథాలయము,
అంగలూరు, కృష్ణాజిల్లా.
అని వ్రాయవలెను.

